# ప్రజాస్వామ్య ప్రస్థానం

## (The Journey of Democracy)

గౌరవ్






ప్రజా ప్రచురణలు
పిఠాపురం - 533 450, తూ॥గో॥జిల్లా.

# ప్రజాస్వామ్య ప్రస్థానం

## (The Journey of Democracy)

గౌరవ్

"ప్రజ సకల భౌతిక విలువల్ని వుత్పత్తి చేసే శక్తే కాదు, ప్రజలే అన్ని ఆధ్యాత్మిక విలువలకీ తరగని ఆధారం. కాల, సౌందర్య, మేధా ప్రమాణాల రీత్యా తొలి తత్వవేత్తా కవీ ప్రజే. సర్వ మహా కావ్యాలకీ ప్రపంచప్పు సకల విషాదాంత నాటకాలకి, అన్నిటికంటే మహత్తరమైన ప్రపంచ సంస్కృతికీ, చరిత్రకీ కర్త ప్రజే."

– మాక్సిమ్ గోర్కి

ప్రజా ప్రచురణలు
పిఠాపురం – 533 450.
తూ॥గో॥జిల్లా.

# Prajaswamya Prasthanam

First Publication in 2011

For Copies,

Praja Publications

Pithapuram

On behalf of ,

Centre for Anarchist Studies (C.A.S.)

Price : Rs. 10/-

Mobile : 9032094492

e.mail : gouravmeka@gmail.com

# ప్రస్తావన

చనిపోయే వరకు బతికి చచ్చిపోవడం వేరు, చావొచ్చేదాకా రోజూ చస్తూ బతకడం వేరు. మొదటిది బతకడమనీ రెండోది బానిసత్వమనీ ప్రతీతి. బానిసత్వాన్ని జీవితంగా భ్రమిస్తే బతకడానికర్థం చావడమేననే భావం స్ఫురిస్తుంది. అది తలకెక్కితే సమాజమంతా శవాల సమూహంలాగే తోస్తుంది. చైతన్యం చచ్చుబడి మనమేస్థితిలో వున్నామో, అసలెక్కడ్నించి ఇక్కడికొచ్చామో తిరిగి ఏ పరిస్థితికి మన ప్రమేయం లేకుండా పోతున్నామో ఎంత గింజుకున్నా బోధపడదు. అవి అర్థం కావాలంటే ఆలోచనతో కూడిన కొద్దిపాటి అంతర్మథనం అవసరం. దాన్ని ప్రేరేపించడమే ఈ అక్షరాల భాద్యత. ఆలోచన అనాదిగా జంతువులనుంచీ మనిషిని వేరుచేస్తోంది. కాబట్టి ప్రస్తావించబడిన విషయం వాస్తవమా కాదా అనేదాన్ని ఆలోచించడానికి ప్రయత్నించడం మనుషులుగా మన కనీస బాధ్యత. అది మనం మనుషులుగా ముందుకు వెళ్ళాలనుకుంటున్నామో లేదా జంతువుల స్థాయిలోనే మిగలాలనుకుంటున్నామో నిర్ణయిస్తుంది. ఈనాడు ప్రజాస్వామ్యంగా చలామణీ అవుతున్న ప్రజాధమస్వామ్యాన్ని వీలైనంత విశ్లేషనాత్మకంగా వివరణాత్మకంగా చిత్రిస్తూ నా పూర్వపు రచనలొచ్చాయి. ప్రజాస్వామ్య వాదులుగా పిలువబడుతున్న కొంతమందిలో అత్యధిక సంచలనాన్నే కలిగించాయి. అసలు అరాజకత్వాన్ని సమర్థించడమే ప్రజాస్వామ్య విరుద్ధమనీ అప్రజాస్వామిక లక్షణమనీ విమర్శించిన అక్షర విటులున్నారు. ప్రజాస్వామ్య చరిత్ర చెప్ప సాహసించిన విరాట్టులూ వున్నారు. వారందరికీ ప్రజాస్వామ్యం గురించిన నా అభిప్రాయాన్ని మరోసారి స్పష్టం చేయడం అవసరమనిపించింది. విజ్ఞానాన్ని, విప్లవాన్ని విస్తరించాలనే భాద్యతతో కొద్దో గొప్పో వాదనా కుతూహలం వుందే తప్ప వివాదాల్ని వెదికేటంత కుతి నాకు లేదు. నేనా తరహా రచయితని కాను. నేను నా తరహా రచయితని మాత్రమే.

– గౌరవ్

In all times and in all places, whatever may be the name that the government takes, whatever has been its origin, on it's organization, its essential function is always that of opressing and exploiting the masses and of defending the oppressors and exploters. It's principal charactertic and indespensable instruments are the policemand and the tax collector the soldier and the prison.

- Errico Malatesta
(1853 - 1932)

సర్వకాల సర్వావస్థల్లోను, ప్రభుత్వం అది ఏ పేరుని తగిలించుకున్నప్పటికి దాని పుట్టుకా, వృద్ధి, పరిణామం మొదలయిన ప్రస్థాన దశలు ఎలా జరిగినప్పటికీ, ప్రభుత్వపు ప్రదాన విధి మాత్రం ప్రజల్ని పీడించడమే, జనాన్ని క్రూరంగా దోచుకోవడమే, అలా ప్రజానీకాన్ని అణచివేస్తూ దోచుకొనే దోపిడీదారుల్ని, ప్రజా పీడకుల్ని రక్షిస్తూ కాపలా కాయడమే. అందుకు అది తన స్వాభావిక సరంజామా, అనివార్యమయిన సొత్తూ అయినటువంటి పోలీసుదళము, పన్ను కలెక్టరు సైనిక పటాలము, జైలు బంధీఖానాలని వాడుకుంటుంది.

- ఎర్రికో మాలాటెస్టా
(1853 - 1932)

# I

చరిత్రలో నియంతృత్వ పాలనలన్ని ప్రజాస్వామ్యం పేరుతోనే ప్రారంభించబడ్డాయి. నియంతలందరూ ప్రజాస్వామ్యం కోసమే పోరాటాలు చేసామనీ, నెత్తుటినదులు పారించామానీ, మనుషుల మృతదేహాల్ని మూటలు కట్టించామని అశుద్ధపు కూతలు కూసారు. వారి దృష్టిలో అదే ప్రజాస్వామ్యం. కాదని ప్రాణాలపైకి తెచ్చుకోవడం ఇష్టంలేని పౌరులూ, పెద్దలూ వారి మాటలకి కట్టుబడి వారి పాటలకి వంతపాడారు. అలనాటి నియంతల నిరంతర నిర్లజ్జ గాత్రాన్ని నేటి పాలకులు పుణికిపుచ్చుకొని తమవంతు తబలా వాయిస్తూన్నారు. అందుకే ఆనాటినుంచీ ఈనాటి వరకు ఈ ప్రబుద్ధులు సాదించామని, సాగిస్తున్నామనీ చెంకలు గుద్దుకుంటున్న ప్రజాస్వామ్యం గుమ్మడికాయల దొంగలా భుజాలు తడుముకుంటూనే వుంది. అప్రజాస్వామ్యాన్ని అప్రజాస్వామ్యమనడమే అతిపెద్ద నేరంగా ఇది పరిగణిస్తోంది. అందుకే ఎక్కడయినా ఏ కాస్త చైతన్యం కనపడినా దాన్ని అణిచివేసేంతవరకు ప్రస్తుత ప్రజాస్వామ్యానికి నిద్రపట్టదు. నిజంగా దాని విధానాల మీదా సిద్ధాంతాల మీదా దానికి నమ్మకముంటే ఇతరేతర వాదాల వునికిని చూసి వణకదు. ప్రతీ ప్రజా ఉద్యమాన్ని చూసి బెదరదు. అసలు తనపై తన అస్తిత్వంపై తన రక్షణపై తనకే అపనమ్మకం ప్రభలి రోజురోజుకూ పోలీసుల్ని, సైనికుల్ని పెంచుకుందుకే చూస్తుంటుంది. సామ్యవాద విదానాలంటూ ప్రజాస్వామ్య పద్ధతులంటూ డప్పు కొట్టుకొనే అన్ని కుహనా ప్రహసన ప్రజాస్వామ్య దేశాలన్ని తమ ఆయుధ సంపత్తిపై, సైనిక అభివృద్ధిపై ఈరోజు పెడుతున్న ఖర్చు చరిత్రలో చెప్పుకున్న ఏ నియంతా ఎన్నడూ పెట్టలేదు సరికదా కనీసం వూహించనుకూడా లేదు.

హింసంటేనే తెలీనట్లు తొస్సిమాటలు చెప్పే ప్రస్తుత ప్రజాస్వామ్య దేశాల పాలనా ప్రస్థానమంతా రక్తపుటేరుల దారుల్లోనే సాగింది. ఈనాటికి సాగుతోంది. ఆటవిక దశలో మానవుడు ఆకలితో లేదా కలహాల్తో తోటి

మానవుడ్ని చంపచూసాడే కానీ ఈనాటి ఆధునిక మానవ మృగంలా తన అస్తిత్వం కోసమో, అహంకారాన్ని చూపించడానికో ఎవర్ని హత్యచేయదల్చుకోలేదు. నాగరికుడినని నక్కబతుకు బతికే ఈనాటి మరమనిషి అల్పమైన ఉద్రేకాలని కూడా అదుపులో పెట్టుకోలేని అధమాధమ స్థితిలో వున్నాడు. అతడేర్పరచుకున్న రాజ్యమే అతడ్ని బలితీసుకుంటున్నా ఏమీ చేయలేని చేతకానితనంతో చేవచచ్చి చివరికి దాన్నే పౌరసత్వమనుకుంటున్నాడు. మనిషిని అధికారికంగా హత్య చేయడమనేది ప్రభుత్వంతోనే ప్రారంభమయింది. ప్రభుత్వమనేది వున్నంతవరకూ ఆ అమానుష క్రీడ వుంటూనే వుంటుంది. అందుకే "From my point of view the killing of another except in defence of human life, is archistic, authoritarian, and therefore, no anarchist can commit such deeds. It is the very opposite of what anarchism stands for ...." అంటాడు జోసెఫ్ లాబాడీ.

II

మనిషి స్వతహాగా ఉద్రేకి. కొన్ని వుద్రేకాలు అతనిలో మానుషత్వాన్ని ఇనుమడింపజేస్తే మరికొన్ని అతడిలోని అమానుషత్వాన్ని తట్టిలేపి రెచ్చగొడుతుంటాయి. అమానుష వుద్రేకం మోతాదు మించితే వున్మాదంగా మారుతుంది. ఈనాడు మనిషిని అనుక్షణం భయపెడుతున్న మతోన్మాదమూ, తీవ్రవాద ఉగ్రవాదాలన్ని ఆ కోవలోవే. మానవుడు తనకీ, సమాజానికి, అంటే తన తోటివారికి ఉపయోగపడే వుద్రేకాలనూ, గుణ స్వభావాలను వృద్ధి చేసుకోనారంభించీ, అవాంఛితమైన వాటిని, అతడిని పశుప్రాయుడిగా పరగణించే వుద్రేకాలనీ, విసర్జించడంలోనే అతడి మాననీయ దృక్పదం వీక్షించవచ్చు. మానవుడు తనని తాను వ్యవస్థలో క్రమ బద్ధీకరించుకోవడానికిగాను, ఆరంభంనుంచీ అనేక విధానాల్ని రూపొందించుకున్నాడు.

అయితే మొదటినుండీ అతడి స్వతంత్రేచ్ఛ, స్వేఛ్ఛా ప్రవృత్తి ప్రాతిపదికగానే అవి రూపుదిద్దుకునేవి. ఒకరకంగా చెప్పాలంటే మనిషి సామూహికంగా జీవించిన నాటినుంచి ప్రజాస్వామ్యం ప్రారంభమైంది. పద్దతులకీ, సిద్ధాంతాలకి, ప్రతిపాదనలకీ స్పష్టమైన ఆదారాలు ఈనాడు పూర్తిగా ఆశించిన స్థాయిలో మనకి లభించకపోవచ్చును కానీ ఆటవిక దశలోనే మానవుడి ప్రవృత్తి మార్పు దిశగా పయనించి, సామూహిక సంక్షేమం గురించి ఆలోచంచకపోలేదని చరిత్ర పరిశీలిస్తే తెలుతుంది. ఎందుకంటే మనిషి ఎపుడూ కూడా ఎవరిచేతా పాలించబడాలని అనుకోడు. అదతడి స్వేచ్ఛాపిపాసకే విరుద్ధం. "I am an aranchist ! Wherefor I will not rule and also ruled I will not be." (నేనో అరాజకవాదిని. నేనన్నడూ పాలించను, పాలించబడాలని అనకోను) అంటాడు హెన్రీ మేకే.

III

ప్రజాస్వామ్యపు రాజ్యాంగబద్ధమైన పాలనని గురించిన భావన క్రీ॥పూ॥ 508లోనే గ్రీకులో ఎథెన్సులో రూపొందించుకున్నట్లు తెలుస్తోంది. ఆచరణాత్మకంగా అయిదో శతాబ్ధానికి పూర్వమే ప్రజాస్వామ్య సంబంధమయిన ప్రయోగాలు జరిగాయి. ప్రాచీన నాగరికతకి శిధిల సాక్ష్యాలుగా మిగిలిపోయిన హరప్పా, మెహెంజోదారో, మెసపుటేమియా సంస్కృతిలో ప్రజల జీవన విదానాన్ని అధ్యయనం చేసిన శోధకులు వాటిలో పాలనాపరమైన వ్యవహారాల్లో ప్రజాస్వామ్యపు అంశం లేకపోలేదనే వాదన వెలువరించారు. ఏకచ్ఛత్రాధిపత్యం వలనో ప్రభుత్వ నియంతృత్వం వల్లనో ఆనాడు అంత అధ్భుత నిర్ణయాలు, సమిష్టి జీవన విధానాలు సాధ్యమై వుండేవి కాదనీ, ఒకవేళ అదే నిజమైతే, అంత సుదీర్ఘ కాలంపాటు ఆయా సంస్కృతులు వెల్లివిరిసి వుండేవి కాదని వారి అభిప్రాయం.

ఇవి కాకుండా ప్రాచీన ఈజిప్ట్, రోమ్, స్పార్టా మొదలైన చోట్ల పరిపాలనల్లో ప్రజాస్వామిక తంత్రాలు ఉపయోగించినట్లు తెలుస్తోంది. ముఖ్యంగా గ్రీకు, రోమన్‌ల దేవుళ్ళు, దేవతల కథల్లోనూ, అలౌకికమయిన అతీంద్రియ గాథల్లోనూ సమిష్టి ప్రయోజనాన్ని కాంక్షించిన ప్రామీథియస్ లాంటి పాత్రలు అనేకం దర్శనమిస్తాయి.ఇక స్పార్టా ఆనాటికి అత్యంత విప్లవాత్మకమైన విదానాల్ని అనుసరించే పాలకుల్ని చరిత్ర కందించింది. ఇతర ప్రభుత్వాలతో, రాజ్యాల్తో పోలిస్తే అత్యధిక ప్రజాస్వామ్య అభిమతాన్ని జీర్ణించుకున్న పాశ్చాత్య దేశం చారిత్రకంగా స్పార్టా ఒక్కటేనేమో! ఎందుకంటే అస్తికత్వంలోనున్న నాటి నియంతృత్వ ధోరణులకి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య పాలన కోసం పోరాడిన ధీరుల జాబితాలో స్పార్టా, స్పార్టకస్ బానిస తిరుగుబాట్లే మొదటివేమో!

## IV

భారతదేశం విషయానికొస్తే ఆర్యుల రాకకి పూర్వమే ఇక్కడ ప్రజాస్వామ్య విదానాలు వుండేవి. గణాలు, సంఘాలు మొదలైన సామూహిక కొలువులతో సమస్యల్ని సమిష్టిగా పరిష్కరించుకునే పద్ధతి ప్రాచీనకాలం నుంచీ భారతదేశంలో వుంది. బౌద్ధావిర్భావం జరిగిన పిమ్మట పాలనా యంత్రాంగ వ్యవహారాల్లోనూ, రాజకీయ అంశాల్లోనూ ప్రజాస్యామ్య ప్రమేయం అధికమయిందన్నది నిర్వివాదాంశం. బౌద్ధం బోదనలకి, బౌద్ధుల పారదర్శకతకీ ఆకర్షితులయిన అనేకమంది రాజకీయ ప్రముఖులు, మహారాజులూ కూడా అందుకు కారణం. ముఖ్యంగా రాజకీయ సంబంధమైన పాలనా రహస్యాలు బహిర్గతం కావడం ఆనాడు అత్యంత విప్లవాత్మకమయిన విషయం. అరాజకత్వాన్నీ, సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని ఆవిర్భవించే దిశగా ఎక్కడ యత్నిస్తుందోననే భయంతోనేనేమో ఆనాటి బౌద్ధాన్ని అణగదొక్కి అసలు భావాన్ని సమాధిచేసి నేటి నకిలీ శాఖల్ని నిర్మించారు. ప్రజలు తమని తాము

పరిపాలించుకోవడమంటే తమని అవమానపరచడమేనని పాలక రాక్షసులు భావం. అందుకే అరాజకత్వం లేదా ప్రజాస్వామ్యం గురించిన సత్యాల్ని సమాజానికి తెలీకుండా వుంచడం కోసం వృధా ప్రయత్నాలన్ని చేస్తుంటారు. అయితే అవన్ని తాత్కాలికంగా తెరలు కప్పడానికి వుపయోగపడతాయే తప్ప శాశ్వత పరిష్కారం చూపలేవు. అందుకే " A democracy Cannot be both ignorant and Free" అంటాడు థామస్ జెఫర్సన్. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛా,అజ్ఞానము రెండూ ఇమడలేవు. అలా ఇమిడితే అది ప్రజాస్వామ్యం అవదు.

## V

ప్రజాస్వామ్యానికి సామూహిక చైతన్యం ముఖ్యం. సమిష్టిపరంగా అది సంభవించవలసినదేకానీ, ఏ ఒకరిద్దరి తోడ్పాటుతో సమాప్తమయ్యేదయితే కాదు. సాంఘిక పరిణామంలో రాజకీయ మర్పానేది తప్పనిసరి. అయితే అది ప్రజానీకపు చైతన్యాన్ని తప్పదోవ పట్టించడం కూడా కద్దు. అందుకే "The Social revolution is seriously Compromised if it comes through a political revolution" అంటాడు ప్రముఖ అరాజక సిద్ధాంతకర్తయిన ప్రౌధాన్. అంటే విప్లవమనేది సమాజంలోనూ, అందులో అత్యధికశాతం అణగారిన వర్గాల ప్రజల్లోనుంచి రావలసిందే కానీ ఇతరేతర మార్గాల్లో వచ్చినా అది వ్యర్ధమేననే భావాన్ని వెలిబుచ్చాడు. రాజకీయ రంగు పులుముకుని ఒళ్ళు చరుచుకునే తిరుగుబాట్లన్నీ తిరోగమనానికి చిహ్నం. వాటివల్ల తాత్కాలికంగా స్వల్పమైన సంస్కరణలు సాధ్యపడగలవు తప్పా మూలభావాలు మారాలనే తోవలోకి రాలేవు. తద్వారా సామూహిక మార్పు అంతకంతకూ దూరం కావొస్తుంది. అందువలన ప్రగతి గమనం కుంటుపడి ప్రగతిహీన వాదాల ప్రవాహం అధికం కాజొస్తుంది.

ఈరోజు ఎన్నికల ఆటలో గెల్చి కుర్చీలాటలో కుమ్ముకుని చెరో కుర్చీని చెరిసమానంగా పంచుకొని ప్రజాస్వామ్యం పేరుతో ప్రజలకి కుచ్చుటోపీ పెట్టి ప్రతీరోజు కూడబలుక్కుని పేకాట సంస్కరణలు ప్రవేశపెడుతున్న నేటి ప్రజాస్వామ్యం ప్రజల్ని లాలిస్తోందేకాని పాలించట్లేదు. అందుకే అడపాదడపా తలెత్తే అమ్ముడు సిద్ధాంతాలు అయాచితంగానే అంతెత్తు లేచే ఉబుసుపోక ఉద్యమాలుతప్ప జన జీవితాల్ని మార్పుదిశగా సుముఖం చేసే ప్రయత్నాలు లేవు.

**VI**

కొన్ని ప్రజాసంఘాలు వైప్లవ పదజాలాన్ని అత్యంత ఘాటుగా ఉపయోగిస్తాయి. వాటి వునికి ప్రజానీకంలో వుద్రేకాల్ని రెచ్చగొట్టి పబ్బం గడుపుకోవడమే కానీ వారిలో భావ చైతన్యం కలిగించడం కాదు. కేవలం హింస ద్వారానే మార్పు సాధ్యమవుతుందనే వాదన నిజం కాదు. ఒకవేళ హింస ద్వారానే విప్లవం సాధ్యమవుతుందనే భ్రమలో ఏ వాదనైనా వుంటే అది హింసాత్మకమో, వున్మాదమో అవుతుందే కానీ ప్రజా విప్లవనాదం కాదు. ప్రజానీకంలో చైతన్యం కలిగించడం ద్వారా కాని విప్లవం ఆయుధాలవలనో, బలప్రయోగంతోనో వస్తుందనుకోవడం ఉత్త అవివేకం. అందుకే, "If we cannot by reason by influence by example by strenous effort and by personal sacrifice, mend the bad places of civilization, we certainly cannot do it by force." అంటాడు ఆబెరన్ హెర్బర్ట్. ప్రముఖ సామ్యవాద ఆద్యుడైన ఏంగెల్స్ కూడా శాంతియుతంగా విప్లవమనేది సాధ్యమైనపుడు కూడా హింసాత్మక మార్గాల్ని అనుసరించడం తెలివితక్కువ పనని 1840లోనే వ్యాఖ్యానించాడు. ఆనాటి నుంచీ ఈనాటి వరకు మానవుడి హింసాత్మక ప్రవృత్తిని ప్రాథమిక పశుప్రవృత్తికి ధీటుగా ప్రేరేపించే వాదాలు వుద్భవిస్తూనే వున్నాయి. వాటి అస్థిత్వంతో మానవుడిలోని మానసిక ఉద్రేకాల్ని రెచ్చగొడుతూనే వున్నాయి.

అయితే వాటికి తగ్గ ప్రజాతంత్రోద్యమాలని గురించిన ప్రయాత్నాలు కూడా కొద్ది మోతాదులో నుండడం వలనే ఇంకా సత్యాసత్య వివేచన సాగుతోంది.

VII

ప్రపంచ విప్లవాల ఆంతరిక ఆదర్శం ప్రజాస్వామ్య సాధనే. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం జరిగిన పోరాటాలన్నీ ఉన్నత వ్యవస్థ స్థాపన కోసమే జరిగాయి. అంటే వాటి వుద్దేశ్యం సర్వోన్నత సంక్షేమాన్ని ఆవిష్కరించడమే. మరి ఈనాటి వరకు అలాంటి సంఘర్షణల వల్ల ఏమీ ఎందుకు ఒరగలేదంటే వాటి కొరకు ఎంచుకున్న మార్గం ఇరుకు కావడమే. వుదాహరణకి భారత దేశ స్వాతంత్ర్య సంగ్రామం తీసుకుంటే ఇక్కడ పూర్ణ వైప్లవావశ్యకత గుర్తించిన కొందరు ఆ దిశగా ప్రజానీకాన్ని నడిపించే ప్రయత్నం చేయకపోలేదు. అయితే దానికంటే కూడా మతోన్మాద మంత్రాలూ, వ్యక్తిగత తంత్రాలే ప్రదాన భూమిక పోషించాయి. అసలు భావస్వాతంత్రం సాధ్యం కాకుండా అసంపూర్ణ అర్ధబావాల్తో లేదా అరువు బావాల్తో సంపాదించింది స్వాతంత్రం కాబోదు. ప్రభుత్వమనేదున్నంతకాలం ప్రజలు మగ్గవలసింది పరతంత్రంలోనే కానీ స్వతంత్ర రాజ్యంలో కాదు. ఎందుకంటే నిజమైన స్వాతంత్రం సాధ్యపడితే ప్రజానీకపు సాంఘిక, ఆర్ధిక సమస్యలకి సత్వర పరిష్కారం లభ్యమవుతుంది. "Liberty is the solution of all social and economic questions" అంటాడు జోసెఫ్ లాబాడీ. సంపూర్ణ స్వాతంత్రం గురించిన భావన విప్లవకారుడూ, అరాజక వాదీ అయినటువంటి భగత్‌సింగ్‌కి వచ్చిన తర్వాతగానీ మనదేశ ముసలి కాంగ్రెస్‌కు రాలేదు. భగత్‌సింగ్ ప్రకటనతో బల్బు వెలిగిన వృద్ధ కాంగ్రెస్ “డొమీనీయన్ స్టేటస్” గురించిన వైస్రాయ్ అనుమతి కోసం అడుక్కోవడం మానేసి “టోటల్ ఇండిపెండెన్స్” అంటూ హడావిడిగా తన అరువుతత్వాన్ని సవరించుకుంది.

## VIII

ప్రభుత్వమంటేనే నియంతృత్వం. అందులో మంచి ప్రభుత్వాలూ చెడ్డ ప్రభుత్వాలూ అనేవుండవు. ప్రభుత్వాలన్నీ ప్రజల్ని బుజ్జగించడం ద్వారానో బల ప్రయోగం ద్వారానో నిద్రపుచ్చేవే. అందుకే "All government is tyranny అంటాడు ఎమర్సన్. ప్రభుత్వమనేదాంట్లో ఒకరిద్దర్నిబట్టి ఆ విధానాన్ని సమర్ధించడం సరికాదు. ఎందుకంటే అందులో అత్యధికశాతం జలగలే వుంటాయి. జనాల రక్తం రుచి మరిగిన కొద్దీ అవి మరింత విజృంభిస్తుంటాయి. ప్రభుత్వమనే భావన భావ బానిసత్వానికి, పాలనా నియంతృత్వానికి పరాకాష్ఠ. అది ఏ పేరుతో పిలుచుకున్నా ఒకటే. కార్మిక నియంతృత్వం పేరుతో కమ్యూనిజం ప్రతిపాదించిన అమానవీయ సిద్ధాంతాన్ని అరాజకవాది అయిన బకునిన్ ఆనాడే మార్క్స్‌తో ముఖాముఖి తలపడి ఎండకట్టాడు. అయినా ఈనాటికీ దొంగరాతలు, చొంగకూతలు కూసే ఎర్రజెండా పార్టీలు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తూ అరాజకత్వానికి వ్యతిరేకంగా అనేక అపసవ్యపు సంగతుల్ని ప్రచారం చేస్తూ చరిత్రని వక్రీకరించేందుకు సాయశక్తులా కృషి చేస్తున్నాయి. అందుకే సామ్యవాదాన్ని సమర్ధించినా కూడా "Freedom without socialism is privilege and injustice, socialism without freedom is slavery and brutality" అన్నాడు మైకేల్ బకునిన్. ఆ తర్వాత ఏదారీ కనబడక మానవుడే నా దారంటూ పాత సీసాకి కొత్తమూత కనిపెట్టిన రాయ్ స్వేచ్ఛ మీద చాలానే నొక్కులు నొక్కినా చివరికేదారీ తేల్చుకోలేక స్వేచ్ఛే అన్నిటికీ దారంటూ వక్రమార్గం పట్టాడు.

## IX

"Our object is the freedom of the producing classes; this ultimate goal will be attained after a long and bitter struggle; therefore our primary task is to organize the masses and lead them in the struggle for economic freedom" అని 1923లో non-violance and the masses (అహింసా మరియు ప్రజలు) అనే చర్చలో ఆర్థిక స్వేచ్ఛని వుల్లఖించిన రాయ్, ఆ తర్వాత ఉత్త స్వేచ్ఛంటూ సొంత గప్పం కొట్టుకున్నాడు. బకునిన్ వాక్యమైన "కింది నుంచి విప్లవం" (Revolution from the below) ని యథాతదంగా కాపీకొట్టిన రాయ్ స్వేచ్ఛపై తన నొక్కుడుని సైతం బకునిన్ నుంచే గ్రహించినట్లు తెలుస్తోంది. రాయ్ మేధావి, ధీమంతుడు, కార్యశీలి. అతడి తాత్విక శోధనాలోతుల్ని, వైప్లవావిష్కరణ కృషినీ తృణీకరించడం నా భావం కాదు. ఆదార రహితంగా వ్యవహరించి ఇప్పటికే ఆ కార్యభారాన్ని మోస్తున్న కరడుగట్టిన కమ్యూనిష్టుల చెంతకు నేను చేరాలనుకోవడం లేదు. కానీ సత్యాన్ని అన్వేషించడానికి ఎవరూ అతీతులు కాదని నమ్ముతూ ఈ విషయాన్నిక్కడ ప్రస్తావించాను. మైకేల్ బకునిన్ మాటల్నిక్కడ చూడండి. "Freedom can be created only by freedom that is by a universal rebellion on the part of the people and free organization of the toiling masses from the bottom up." ఈ మాటల్ని మినహాయించి చూసినంతమాత్రాన రాయ్‌కి అలౌకికత్వం వంటబట్టదు. ఇవి కాకుండా రాయ్ ప్రతిపాదించిన "భాగస్వామ్య ప్రజాస్వామ్యం" (Participatory Democracy) అప్పటికే అరిగిపోయిన టైరుకి పంచరేసి ప్రకటించిన గాంధీ గ్రామ స్వరాజ్ సర్వోదయ సిద్ధాంతాలకి వంతపాట పాడేదే.

X

మానవుడికి ఆవిష్కృతమయ్యేదంతా జ్ఞానం కాదు. అందులోనుంచి జ్ఞానం కోసం కృషి చేయాలి.జ్ఞానం వల్ల చేసేదంతా తత్వాన్వేషణ కాదు. దీన్ని తాత్వికవగాహనతో చేయాలి. అలాగే తత్వసారమంతా సత్యశోధనకీ, సత్య సాధనకీ వుపకరించేది కాదు. ఎంత గొప్ప తాత్వికావిష్కరణయినా కాలగమనంలో కొంతమేరకు మనకి మార్గం చూపగలిగేదేకాని పూర్ణాకృతిని వీక్షింపచేసేది కాదు. అసలు విప్లవానికెపుడూ ఏ వాదంతోను శాశ్వత సంబంధమూ, నిర్బంధమూ ఉండదు. మనిషి మస్తిష్కం కొంతమేరవరకు వైప్లవగతిని గుర్తించి దానికి కావలసిన పరిస్థితుల్ని చరిత్ర సహాయంతో ప్రతిపాదించొచ్చుకానీ విప్లవాన్ని గురించిన పూర్ణ రూపాన్ని ప్రతిబింబించడం సాధ్యం కాదు. విప్లవమనేది చిరంతన చింతనే తప్ప స్థితిని గూర్చి సంఘర్షించి సరిబుచ్చుకునేది కాదు. అందుకే "Revolution is not something fixed in ideology, nor is it something fashioned to a particular decade. It is a perpetual process embedded in human spirit" అంటాడు కెమీలియో బెర్నరీ . అంటే విప్లవమనేది మానవ చైతన్యంలోంచి జన్మించవల్సిందేకానీ ఏ వాదపు గాధల్లోనూ బాధల సిద్ధాంతాల్లోనూ నిర్ధిష్టంగా ద్యోతకమయ్యేది కాదని భావం.

XI

అసలు ప్రజాస్వామ్యమంటూ సాధ్యమైతే మానవ భావగమనం ప్రగతి దిశగా పయనించే వీలు ఏర్పడుతుంది. గతిక్రమం ఏ సమాజంలోనైనా సాగక తప్పదు కానీ, ప్రభుత్వం దానిని కుంటుపరచాలని మాత్రం ప్రయత్నిస్తుండడం వల్ల ప్రస్తుత స్వామ్యంలో వేగంగా ముందుకెళ్ళేందుకు దానికి అనేక అవాంతరాలు ఎదురౌతాయి. ప్రజాస్వామ్యమనే భావవని ప్రచారం చేయడమే ప్రభుత్వాల ప్రధాన విధి. ఎందుకంటే ప్రజలు తాముున్నది

ప్రజాస్వామ్యంలో కాదనే నిజాన్ని ఎక్కడ గుర్తించేస్తారోననీ ప్రతీరోజు ఆ పదాన్ని పాడుచేసికాని, వదిలి పెట్టవీ ప్రభుత్వాలు. ప్రజల్ని తాము ప్రజాస్వామ్యంలో ఉన్నామని నమ్మించడమే నియంతృత్వ ప్రభుత్వాల కార్యక్రమం. పూర్వపు ప్రభుత్వాలు ఆ పనిని ప్రత్యక్షంగానే చేస్తే ఈనాటి ప్రభుత్వాలు ప్రజాస్వామ్యం ముసుగువేసుకొని పరోక్షంగా ప్రజలను మోసం చేస్తున్నాయి అదే తేడా! అందుకే "Democracy has proved only that the best way to gain power over people is to assure the people that they are ruling themselves. Once they believe that, they make wonderfully submissive slaves." అంటాడు జోసెఫ్ సోబ్రాన్. కాబట్టి ప్రభుత్వాలు ఉపయోగించే ప్రజాస్వామ్యానికి అర్థం ప్రజలు తమను తాము విధేయతతో అణుకువగల బానిసలుగా ప్రభుత్వానికి అంకితం చేసుకోవడమే. అంటే పౌరసత్వమనే పదానికి అర్థం పరతంత్రమన్నమాట. అందుకే ఈనాటికి మనకి వారసత్వంగానో, నేర వృత్తాంతంగానో, నోట్ల కట్టలతోనో తప్ప ప్రజలలోంచి నాయకులు రావడంలేదు. కాబట్టే ఏ నాయకుడు ప్రభుత్వానికి తొత్తుగా వ్యవహరిస్తున్నాడే గాని, ప్రజాతంత్ర వ్యవహారాలను నడిపించడంలేదు.

## XII

ఈ రోజుకీ మన రాజకీయాల పరిస్థితిలో మార్పులేదు. రాజకీయవేత్తల రాబందు తత్వాల్లో ఏ చేర్పు లేదు. పెట్టుబడిపెట్టి రాజకీయ హోదాని కొనుక్కోవడం సాధారణ విషయమై చాలా కాలమైంది. అంటే అధికారామనేది అంగడి సరుకుగా మారిపోయిందన్నమాట. పరిపాలన అనే దానికి వ్యాపారమనేది పర్యాయపదంగా వాడబడుతోంది.

ఈనాటి మన ముసుగు ప్రజాస్వామ్యంతో పోల్చుకుంటే 17వ శతాబ్ద తొలిదినాల్లో, తర్వాత మతాధిపతుల చేత మలిదినాల్లో ప్రయత్నం చే ప్రయోగించబడిన తెలియని స్వామ్యం ఎంతో మేలు. ఎందుకంటే మతం ఎ కుక్కవేషాలు వేసినా నేటి వ్యవస్థలా నక్కజిత్తులు వేయలేదు. ప్రజాస్వామ్యం పేరి జపం చేస్తూ మనుష్యుల హక్కుల్ని కాలరాస్తున్న ఈనాటి వ్యవస్థది పచ్చి నెత్తు దాహం. అందుకే నేరస్థులతోబాటు ప్రజాతంత్ర ఉద్యమకారుల్ని, అరాజక వీరుల్ని ప్రజాస్వామ్య ధీరుల్ని కూడా జైళ్ళల్లో పెట్టి తన అస్తిత్వం నిలుపుకుంటోంది. మాన హక్కులపై, మానుష సమాజంపై రాజ్యానిదెప్పుడూ అమానుష వైఖరే. వ్య స్వేచ్ఛా, స్వతంత్రాలపై దానిదెప్పుడూ దుర్మార్గపు ప్రవృత్తే. ఇక అరాచకత్వమన్నా ప్రజాస్వామ్యమన్నా ప్రభుత్వానికెప్పుడూ బెదురే. చైతన్యమనేది ఎంతచిన్నదైనా కానీయండి, దానిని చిదిమేసేంతవరకు రాజ్యానికి నిద్రపట్టదు. ఎందుకంటే అసలు దాని అస్తిత్వాన్నే అది పూర్తిగా నమ్మదు. కాబట్టి ఇతరుల ఉనికిని చూస్తే దానికెపుడూ అనుమానమే. ప్రజలు చైతన్యవంతులు అయితే ప్రభుత్వపు అస్తిత్వాన్ని ప్రశ్నిస్తారు. దాని నిరుపయోగాన్ని గుర్తిస్తారు. "Strong people do not need a government." అంటాడు ఎమిలినో జపాటా. బలహీనమైన మానసిక జాడ్యులముందే రాజ్యం ఆటలు సాగుతాయి. అందుకే అది జనాల్ని ఎల్లప్పటికీ జాడ్యానికంకితం చేయడానికే చూస్తుంది.

## XIII

ఇంతకీ మనకసలు ప్రభుత్వమనే ఒక జలగ అవసరం ఏంటి? నిజానికి ఏమీ లేదు. వ్యవస్థ జీవన విదానాన్ని క్రమబద్ధీకరించేందుకు ఒక నిర్దిష్టమైన ప్రక్రియను పాటించడం సబబు. అయితే అది ప్రజలు ఏర్పరచుకునే విధంగా దాని పనితీరు సక్రమంగా లేకపోతే వారే దానిని మార్చుకునే విధంగా

వుండాలే తప్ప తామెన్నుకున్న నాయక గణం ప్రభుత్వాలు తమ హక్కుల్నే కాలరాసి సమాజ సంక్షేమానికి తిలోదకాలిచ్చేలాగా వుండాలని ఏ వ్యక్తి కోరుకుంటాడు? కానీ నేటి వ్యవస్థ వున్నదలాగే. మనమెప్పుకున్నా లేకున్నా పిల్లల్లా చూసుకోవాల్సిన పౌరుల్ని ప్రభుత్వమే పీడిస్తోంది. ఉన్నవాడికి కాపలా కాస్తూ కూటికి లేనివాడ్ని కాటికీడుస్తోంది. ప్రజల రక్షణకి భాద్యత వహించాల్సిన ప్రభుత్వం నిరంతరం స్వీయరక్షణకే సమయాన్ని కేటాయించుకుంటుంటే ఇక పాలనా బాధ్యత దానికి పట్టేదెప్పుడు ? అసాంఘిక శత్రువుల్ని తరిమి కొట్టెదెప్పుడు ? అరాజకత్వానికి అసాంఘికత్వానికి కూడా తేడా తెలియని దుర్భరస్థితిలో వుంది ఈనాటి ఈగతోలు ప్రభుత్వం. అందుకే "Governments and the military purport to project the public from enemies and if there were no enemies they would have to invent some, for the simple purpose of rationalizing their existence". అంటాడు లారెన్స్ లాబాడి. కాబట్టి ప్రజలకి హాని కల్గించే సాంఘిక శత్రువుల్ని తన అస్తిత్వాన్ని రక్షించుకోవడం కోసం సృష్టించడం ప్రభుత్వానికి తప్పనిసరి.సమాజంలో నేరాలకి సరయిన కారణాన్ని కనుగొని మనిషిలో, ముఖ్యంగా నేరస్తుల్లో నేరప్రవృత్తిని తొలగించే కార్యక్రమాలు కావాలి కానీ నేరస్తుల్ని శిక్షించినంతలో నేరాలు ఆగిపోవు. మానవుడిలో స్వతహాగా నేరస్వభావం వుండే అవకాశాలు చాలా తక్కువ. నేరస్తుల్లో ఎక్కువశాతం పరిస్థితుల ప్రభావం పడ్డవారే. ఆ పరిస్థితులు మారనంతవరకు మార్పూరాదు, నేరాలు ఆగవు.

## XIV

"The main question is not what motive inspired the law, but what it will be possible for men of bad motive to do with the law". అంటాడు బెంజిమన్ ట్రాకర్. ప్రభుస్వామ్యంలో చట్టమనేది ప్రభుత్వం

చేతిలో ఇనుపగొలుసుల వలలాంటిది. ఎక్కడయితే చైతన్యం ఉద్భవిస్తుందో అదక్కడ వాలి దాని పీకనులిమికాని వదిలిపెట్టదు. ప్రపంచవ్యాప్తంగా వున్న న్యాయస్థానాలు, పోలీసు స్టేషన్లూ, సైనిక సంఘాలూ, ప్రత్యేక పోలీసుల విభాగాలూ, రహస్య గూడాచార్య సమాఖ్యలూ ఇవన్నీ కాకుండా మళ్ళీ వీటన్నింటికీ విభాగాలు, ఉప విభాగాలూ, ఉప విభాగపు ప్రధాన శాఖలు, ఉప విభాగపు వుపాంగ శాఖలూ, సహకార వుద్యోగ సంఘాలు... ప్రజల్నించి వసూలు చేయబడ్డ పన్నుల సొమ్ముల్ని మింగడమే పనిగా పెట్టుకున్న ఈ జలగశాఖలన్ని జనాల్ని వుద్ధరించడం మాటటుంచి నీచస్థితికి దిగజార్చకుండా వుండడం లేదు. ప్రజలకి రక్షణ శాఖపై ఏకొద్దిగానైనా గౌరవమనేదుంటే ఈనాటి ఇస్త్రీస్వామ్యం దాన్ని కూడా తుడిచిపెట్టుకుపోయేలా చేస్తోంది. సామాన్యుడికి ఆదర్శంగా నిలవాల్సిన పోలీసులు అదే సామాన్యుల ప్రాణాల్ని హరిస్తూ ఎన్‌కౌంటర్లూ, లాకప్‌డెత్‌లూ చేస్తూ ప్రభుత్వానికి తొత్తుల్లా తయారయ్యారు. "We sleep safe in our beds rough men stand ready in the night to visit voilence on those who would do us harm" అంటాడు జార్జ్‌ఆర్వెల్ "on importance of police" అనే తన చర్చలో. స్థూలంగా ఇది నేటికి నిజమే అయినా విశ్లేషించి పరిశీలిస్తే మంచి కంటే పోలీసు వ్యవస్థలో చెడే ఎక్కువ దర్శనమిస్తుంది. భ్రష్టుపట్టిన వ్యక్తిగత ఆశయాలూ, సాంఘిక దురాచారాలు, వ్యక్తిత్వలోపం ఇందుకు ప్రధాన కారాణాలుగా కనిపిస్తున్నాయి.

## XV

ప్రభుత్వమంటే అరాజక వాదులకీ లేదా ఇతరేతర విప్లవకారులకీ వ్యక్తిగత వైరమేమీలేదు. ప్రజాస్వామ్య బద్ధమయిన యంత్రాంగ క్రమబద్ధీకరణకి మేమెప్పుడూ వ్యతిరేకం కాదు. ప్రజలందరికీ అన్ని అవకాశాలూ, అన్ని వసతులూ లభ్యమయినపుడు అనవసరంగా రాజ్యాన్ని నిందించడం మాకు

ప్రత్యేకమయిన పని కాదు. అన్ని రంగాల్లో సమానత్వం సౌభ్రాతృత్వం శాంతియుతంగా సాధ్యమైతే విప్లవ ప్రగల్భాలు పలకడం ఎవరికీ సరదాకాదు. పుట్టుకనిబట్టీ, పనినిబట్టీ, వృత్తినిబట్టీ, మతాన్ని బట్టీ, జాతిని బట్టీ, హోదానిబట్టీ, మనుషుల్ని అంచనావేసే రోజులు పోవాలనే ప్రతీ విప్లవ ఘటన తత్వము, తాత్పర్యము. అందుకే "I build no system. I ask an end to privilage, the abolition of slavery, equality of rights, and the reign of law, justice, nothing else. That is the alpha and omega of my argument." అంటూ అరాజకవాదుల మూలసూత్రాల్ని అత్యంత సున్నితంగా, సూటిగా చెప్పాడు జోసెఫ్ ప్రౌధాన్. అరాజకత్వమంటేనే వారంతోట్టోలా వేధవ మొహాలేసుకు చూసే వెలక్కాయలకి మొహం పగిలే జవాబిది. ప్రజాస్వామ్యాన్ని కాంక్షించే ఎవరూ అరాజకత్వాన్ని కాదనలేరు. అరాజకత్వమంటే ప్రజాస్వామ్యపు అత్యున్నత రూపమే. ప్రజాస్వామ్య పరిరక్షణంటూ పెడబొబ్బలు పెట్టే మన నాయకులకీ నయా మేధావులకి అరాజకత్వమనే పదమంటేనే ఎందుకు జంకో తెలీదు. బహుశా ప్రజాస్వామ్య పదమంతో ప్రేమగా ప్రజల్ని మోసం చేయడానికి అరాజకత్వం అక్కరకు రాదని బెంగేమో!

## XVI

"I must tell you, first of all, what anarchism is not. It is not bombs, disorder or chaos. It is not robbery or murder. It is not a war of each aginst all. It is not a return to Barbarianism or to the wild state of man. Anarchism is the very opposite of all that." అంటాడు అలగ్జాండర్ బెర్క్‌మన్. అరాజకత్వమంటే ఆటంబాంబూలూ, అల్లకల్లోలం, గందరగోళం కాదనీ, అరాజకత్వమంటే దోపిడీ, దొంగతనం, హత్యలూ, అత్యాచారాలూ కావనీ వ్యక్తిపై చేసేయుద్ధమో, వ్యవస్థని ఆటవిక

జంతు దశకి తీసికెళ్ళే తత్వమో అరాజకత్వం కాదంటూ వీటిన్నింటికీ అరాజకత్వమనేది వ్యతిరేకమంటూ వుద్ఘాటిస్తున్నాడు. అంటే అరాజకత్వమనేది మానవుడి అత్యుత్తమ జిజ్ఞాసలో నుంచి జనించిన మానవ తత్వశాస్త్రమే కానీ వేరుకాదు. అందుకే అరాజకత్వాన్ని ప్రజల తత్వశాస్త్రం (Philosophy of the People) అంటాం. జనాల జీవనాడిని జీర్ణించుకునీ, తద్వారా సమాజ సర్వోన్నత స్థితికి కావలసిన తాత్వికాంశాల్ని తలకెత్తుకుని మాత్రమే అరాజకత్వం ఆచరణాసాధ్యమైన సైద్ధాంతిక ప్రతిపాదనలు (Ideologicaly Pragmatical demonstrations) చేస్తుందేతప్ప, కార్యశీలత లోపించిన కాగడాలను విధి విధానాలు లేని విప్లవాలను పట్టుకుని విర్రవీగదు. అరాజకత్వ తత్వశాస్త్రానికి అంతిమ లక్ష్యాలనేవి వుండవు. అది శాశ్వత గమనంలో శతవంతు పాత్రగానే తననితాను భావిస్తుంది. "What I believe is a process rather than finality, Finalities are for gods and governments, not for the human intellect." అంటుంది ఎమ్మా గోల్డ్‌మెన్. అరాజకత్వం ప్రగతి పరిణామ వాదం. అర్ధంలేని సిద్ధాంత సూత్రాలనూ, అసలాచరించే వారిక్కూడా అర్ధంకాని వైధానిక విలువలను గుడ్డిగా అనుసరించడానికి అది అంగీకరించదు. అరాజకత్వానిది జనశ్రేణుల వుద్యమం. (Movement of the Masses) అందుకు దీనికి అనవసరమైన ఆడంబరాలూ, అతికిపోయే కృత్రిమత్వాలతో పనిలేదు. సమాజంలో మార్పుకి సాంఘిక చైతన్యంతో పాటూ, (Social Conscious sness) అస్తిత్వ చైతన్యాన్ని కూడా (Consciousness of being) సమన్వయం చేయడం ద్వారానే భావ విప్లవం (Ideological revolution) సాధ్యపడుతుందని అరాజకత్వం నమ్ముతుంది. ఇందుకు భావసారూప్యతగల వాదాలతో కలసినడవడానికి అరాజకత్వానికి అనవసరమయిన అభ్యంతరాలేవీ

వుండవు. అందుకే "Anarchism is not a romantic fable but the hardheaded realization, based on five thousand years of experiance, that we cannot enturst the management of our lives to kings, Priests, Politicians, generals, and country commissioners" (అరాజకత్వం అందమయిన కట్టుకథ కాదు. అయిదువేల సంవత్సరాల అనుభవాన్ని ఆధారంగా చేసుకొని ఆవిర్భవించిన మానవుడి వాస్తవ పరిస్థితుల్ని ప్రతిఫలించే తత్వశాస్త్రం. మన జీవితాన్ని రాజులకూ, రాజకీయవేత్తలకూ, మహా పండితులకు, మాయదారి అధ్యక్ష అధికార ప్రభుత్వ ప్రతినిధులకూ అర్పించడాన్ని అరాజకత్వం నిరసిస్తుంది.) అంటాడు ఎడ్వర్డ్ అబ్బే. అవునో, కాదో ఆలోచించి నిర్ణయించుకోవాల్సింది మనమే !

-------- ooo --------

"వాతావరణం బాగా వుంటుందని, యీ యేడు పంట దిగుబడి బాగా వుంటుందనీ, ప్రేమ వ్యవహారం సజావుగా వుంటుందనీ, ఆశిస్తూ బతకడానికి, ధనవంతులమవుతామనీ, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ అయిపోతామనీ ఆశిస్తూ బతకడానికీ మనం అలవాటు పడ్డాం. కాని తెలివైన వాళ్ళుగా అవాలని ఆశించిన వాడెవడూ, నాకు తగల్లేదు. మనకి మనమే అనుకుంటాం. చక్రవర్తి మారితే పరిస్థితి బాగుంటుంది. రెండు వందల యేళ్ళల్లో యింకా మెరుగ్గా వుంటుంది అని. యీ శుభ ఘడియని రేపే తీసుకురావడానికి యెవళ్ళూ ప్రయత్నించరు. మొత్తంమీద జీవితం రోజురోజుకీ సంక్లిష్టం అవుతోంది. తన దారిన తను గడుస్తోంది, జనం యింకా యింకా బడుద్ధాయిలవుతున్నారు. జీవితం నుంచి యింకా యింకా దూరం అయిపోతున్నారు. ... జీవితానందాన్ని ధ్వంసం చేస్తూ విముఖతని కలిగిస్తూ జీవించడం కోసమే రసహీనమయిన పోరాటం చేయడం కంటే నిరుత్సాహభరితమైంటి, విషాదభరితమైంటి మరొకటి లేదు".

- ఆంతోన్ చేహోవ్ (రష్యన్ మహా రచయిత)

# ముగింపు

సొంత గబ్బు కొట్టుకునేంత డబ్బు నాకు లేదు. ఎరువు డబ్బా అరువుగాళ్ళచేత కొట్టించుకునే జబ్బు ఎప్పటికీ రాదు. జ్ఞానమనేది సాంక్రమితమే తప్ప సిద్ధ పదార్థం కాదు. భావమనేది ప్రాకృతిక ధర్మమే కాని పారలౌకిక ప్రసాదం కాదు. మార్పు నిశబ్ధ విప్లవం. నగారాలు వూదకపోయినా, నినాదాలు చేయకపోయినా అది రాకమానదు. అంతటి మార్పుకి ఎంతటి విప్లవ కారుడయినా తనవంతు ప్రయత్నంగా దాని మార్గంలో భాగం కాగలడేకాని ఏకోన్ముఖుడై కార్యాచరణ కావించలేడు. అందుకే అనంతకాల వాహినిలో నా అక్షరాల కృషి అంతంత మాత్రమేనన్నది నా భావం. ఆ కారణంగానే అనవసరమయిన ఆడంబరాలు, మితిమీరిన డాంబికాలు నన్నంతగా ఆకర్షించవ్. అభిప్రాయాల్ని పంచుకుంటూ ఆలోచనల్ని తరచి చూసుకొనే చర్చల పట్ల నాకు అనాస్తకేమీ లేదుగానీ, రాసిన వాటికన్నింటికీ అక్కర్లేని ఆర్భాటాలకి పోయి అత్యుత్సాహంతో నిండిన కృత్రిమత్వాన్ని మోహనరంగరించుకుని అంగరంగ మభావంగా అక్షరాలకి విలువ కట్టే పుస్తకావిష్కరణలు పెట్టడం నాకిష్టంలేదు. అదేదో మనకి పూర్వం భావోత్పత్తి, భాషోత్పత్తులనేవి లేనేలేనట్లు, అక్కడికి అసలు అక్షరాల్ని మనమే కష్టపడి కనిపెట్టినట్లు ప్రవర్తించడం మన మూర్ఖత్వానికి నిదర్శనంగా నిలిచేదే కాని నిజంగా జనానికి పనికొచ్చే విషయమయితే కాదు.

ఉత్తుత్తి సుత్తి కల్సి కొట్టుకున్నంతలో కొత్త సృజనాత్మకత ఏమీ ఉద్భవించదు. వ్యక్తిగత పూనకాలు విడివిడిగా ప్రదర్శించుకున్నంతలో వైప్లవ విధానం ఏమీ ఒంటబట్టదు. సత్యాన్వేషణకి తత్వం తలుపు తట్టడమెక్కటే మార్గం. అది దారి తప్పితే అతత్వాలన్ని తత్వాలుగా తలకెక్కుతాయి.

అవి అసలు తత్వమేలేని శూన్యానికయినా దారితీస్తాయి, లేదా అర్ధతత్వాలుగానయినా మిగిలిపోతాయి. పరిణామ ప్రవాహంలో పరిపక్వం చేందేంతటి పోరాటం చేయలేక సాగిలబడ్డాయి కనుకనే ఇతర జీవుల్ని పశుత్వంతో పోలుస్తాం. వాటికతీతంగా మానవుడు సొంత ప్రస్థానం ప్రారంభించడమూ, అతడే ఆశ్చర్య చకితుడయ్యేంతటి దూరం దివ్యంగా ప్రయాణించడమూ జరిగిపోయాయి. నవీన నాగరికుడిగా అనేకానేక ఆధునిక ఆవిష్కరణల ఫలాల్ని అతిసులువుగా అనుభవిస్తున్న మానవుడు ముందు ఆలోచించాల్సిందీ, ఆచరించాల్సిందీ మానవాళి మొత్తాన్ని ఎలా క్షేమకరంగా ఉంచాలన్న సంగతినే తప్ప విజ్ఞాన శాస్త్రాలతో సంగమిస్తూ అజ్ఞాన అశాస్త్రాల చెంక నాకడానికి కాదు. సమాజంలోని సగటు మనిషి దరికి చేరని సృజన అది సాహిత్యంలోనయినా, శాస్త్ర విజ్ఞానంలో నయినా వృధాయే.

అంతిమ సిద్ధాంతాలమీదా, శాశ్వత సంస్కరణలపైనా, నాకు విశ్వాసం లేదు. ఒక పక్క ఆకలి చావుల్ని అరిగించుకుంటూనే మరోవైపు అభివృద్ధి గణాంకాల్ని అందంగా నెమరేసుకొనే మృగవ్యవస్థ మనది. తుచ్ఛమైన పశు ప్రపంచాన్నే నవ నాగరిక సమాజమంటూ మెరిగేలోకం మనది. సముపార్జించబడిన ఇరుకు ఇతిహాసాలన్నింటినీ సాధించబోయే సగంసగం ఆవిష్కరణలకోసం మౌఢ్యాలకి తాకట్టుపెట్టే మానుష స్వాభావిక లోతుల్లోని స్వార్ధపాలోచనలు సాటిమనిషి కడుపుని ఖాళీగా వుంచినంతకాలం మన ఐతిహాసిక, శాస్త్ర, విజ్ఞాన, సాంకేతిక స్ఫూర్తంతా శుద్ధమైన దూర్త పాండిత్యంతో సమానం.

Will you and your government teach eagles to fly and tigers to hunt ? of course not. No one is so arrogant with nature. But you and your government want to tell me what to buy and how to live, and I am more complex than any eagle or tiger. Give me only the same respect you pay the badger and the blue jay and leave me alone.

After all, Anarchy means nothing more than human ecology!

- Allen Thornton

Laws of the Jungle

నువ్వూ నీ చెత్త ప్రభుత్వమూ గద్దలకి ఎలా ఎగరాలో, పులులకి ఎలా వేటాడాలో నేర్పించారా ? లేదు. ప్రాకృతిక తత్వంతో ఎవరూ తలబిరుసుతో వ్యవహరించరు. మరి అలాంటపుడు నేనేంకొనాలో, నేనెలా బతకాలో నిర్దేశించి నేర్పాలని మీరెందుకు చూస్తున్నారు ? అంటే డేగలకంటే, బెబ్బులికంటే కూడా నేను తీసిపోయానన్నమాట. ముంగీసని, మైనాపిట్టనీ చూసి జాగ్రత్తగా తప్పుకొని గౌరవించినట్లు నన్ను కూడా నా మానాన ఒంటరిగా వదిలేయండి.

ఏది ఏమయినప్పటికి అరాజకత్వం మానవ ప్రాకృతిక శాస్త్రమే కానీ వేరు కాదు!

- అల్లెన్ త్రోన్‌టన్

ఆటవిక న్యాయాలు

అజ్ఞానానికి అనేక కారణాలున్నాయి. జ్ఞానాన్ని ఆర్జించాలనే ఆర్తి లోపించడం అందులో ప్రథమమైంది, ప్రధానమైనది. అర్ధదశాబ్ధం కిందట నన్నొక నక్సలైట్‌గా ప్రచారం చేసిన ప్రబుద్ధుల బాగోతం నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. ఆ విషయం గురించి బహిరంగంగానే నన్ను ప్రశ్నించి భంగపడిన పుంగవులా ఇంకా నా స్మృతి పథంలోనుంచి చెరిగిపోలేదు. అపుడప్పుడే పుట్టుకొస్తున్న కొత్త పరిపక్వతని పూర్ణం చేసుకొనే దిశగా సాగిన ప్రస్థానంలో నా తాత్కాలిక తాత్విక మజిలీల్నే నా తత్వంగా భ్రమసినవారున్నారు. అదికాకుండా నా రచనా శైలి, వ్యక్తిగత వ్యవహారశైలీ కొందరు మిత్రులలో అపార్థాలకు తావిస్తున్నట్లు తెలిసింది. వారి అస్పష్ట అభిప్రాయాలలో స్పష్టత చేకూర్చడం అవసరమనిపించింది. నా మొదటి రచనలో నన్ను మార్క్సిస్టుగా-కమ్యూనిష్టుగా భ్రమించినవారున్నారు. ఆ తరువాత నేనొక తీవ్రమైన, అతిప్రమాదకరమైన అరాజక వాదినని నమ్ముతున్నవారున్నారు. అటుపిమ్మట నేను నాస్తికుడినని, హేతువాదినని, రాడికల్ హ్యూమనిస్టునని, జోరుగా ప్రచారం చేస్తున్న జోరీగలుండనే ఉన్నారు. ఒక దశలో ఇవన్నీ నా యిజాలే అయినా, నిజానికి నేనేవాదినీ కాను. మానవుడిని వాదనలకి పరిమితం చేసే భావాలకు బద్ధ విరోధిని. భావ విప్లవమొకటే మనిషి అభ్యున్నతికి అగ్రాంగం అని భావిస్తున్నవాడిని. ప్రస్తుత రాజకీయ విధానాలకి ప్రత్యామ్నాయంగా అరాజకత్వాన్ని అర్థవంతంగా పరిచయం చేయాలనుకున్నానే తప్పా ఆద్యాంతం అరాజకత్వాన్ని పట్టుకువేలాడే ఉద్దేశ్యం కూడా నాకు లేదు. సర్వామోదం ఎప్పుడూ నాకు సమ్మతంకాదు. ఆరోగ్యవంతమైన విమర్శ దర్శించని విజ్ఞానం వ్యవస్థీకృతమౌతుంది. అటువంటి జ్ఞానం అవివేకాన్ని సంతరించుకొని ఉన్నచోటునే కూర్చుండిపోతుంది. అదే అజ్ఞానం. మతావిర్భావాల మూలం ఇదే. నిరంతర జ్ఞానతృష్ణ మాత్రమే తత్వసాధనకి-సత్యశోధనకి మార్గం సుగమం చేస్తుంది. అందుకు మనిషికి మనిషిని గురించిన ఆదుర్దా తప్పా మరే సిద్ధాంత ముద్రా, వేదాంత దురదా అవసరంలేదు. ఇంతా చదివి ఇంతకీ మీరేపక్షమో చెప్పండంటూ ప్రశ్నించే ప్రబుద్ధులకి ఏమని చెప్పగలను, వారి బుద్ధి ఇంతేనని మౌనంగా సరిపెట్టుకోవడం తప్పా!